ద్ధమనుచు సర్వ్రమణంబు లీశ్వరుగురించి । న్యాయవృత్తిబరగు న్యాయవైశేషిక । మతడె బ్రహ్మమనుచు శ్రుతులగలసి । వినుతిసేయుచుండ వేరొండుదైవంబు । వసుధలోన గలడె బసవలింగ. ౨౦౦

రమణశ్రైలైంగ్య పురాణంబునందు నరకప్రాప్తు యాత్తనుప్రకటితముగ । చర్చింప శివధర్మశాస్త్రమునట్లతద్విధనరకంబని విశ్రుతముగ । తరవస్య భోజనదాన్న దాకాంక్షితియే నరకం వ్రజేత్తను బరగునట్లు । స్కాందంబునను మరికవ్యాచరిత్ర్యాదిదాతాయనుచు బురాణతతులనట్లు । శ్రోయుశ్రుతులు పతిత్య వాయోయనెడుగాన । భర్గభక్తిలేని బ్రాహ్మణులకు । దానమిచ్చినట్టి దాతకు నరకంబు । పాటిదప్పదయ్య బసవలింగ. ౨౦౧

---

## శివానుభవసూత్రివివరము.

ఆత్మధ్యానవ్యక్తమందుప్రాణముబుట్టు ప్రాణమునందు సంభవముమనసు । మనసునవాగ్వృత్తి జనితమావాగ్వృత్తి ప్రభవించుశబ్ద ప్రపంచమట్లు । నాత్మాది భూతాదినందంగముదయించునంగంబునందింద్రియములుబొడుము । ఇంద్రియంబులుజనియించు నవ్విషయ మవ్విషయంబులును సంభవించుకోర్కె । లర్పితంబులగుచు నారోహినవరోహి నాత్మదోచునణగునదియు నవియు । నాత్మయునుత దర్పితాదీనియందయు । ద్భవము జెందుచుండు బసవలింగ. ౨౦౨

పశుపురాజీవాత్మ పాశమంత దేహబంధ మాపశుపాశపతిగురుండు । పశువుబుట్టి సప్తదశలింగ జాతికంత దేహిపాశబంధంబుద్రుంచి । పాంచభౌతికబహిఃప్రకృతి పూర్వమువుచ్చి బ్రాణంబుబాక్ప్రిచారతలయించి । ప్రాణలింగాంగసంబంధమదిష్టించి యందాత్మ దప్పకహత్తుకొల్పి । యాత్మయును బ్రాణలింగనిరంతరాత్మ । రాత్మదానఘుతరంబు సుఖాంచితాను । భూతిస్వామిభృత్యజ్ఞానరీతిసట్లు । మొనగుమీప్రసాదంబును బసవలింగ. ౨౦౩

ఆరాధ్యదేవు నిజాంశమాభావగర్భమునవై యిష్టలింగము సృజింప । సత్కృపాచార్యడాసత్కృపాహస్తగర్భమునప్రసాదదేహము సృజింప । తద్దేశికేంద్రుడాత్మ శ్రుతిప్రాణగర్భమున ప్రాణప్రధానము సృజింప । తద్గురుమూర్తి స్వతంత్రప్రసాదగర్భమున శుద్ధప్రసాదము సృజింప । భావలింగంబు ప్రాణంబు ప్రకృతిగూర్చి । దానిక

సమర్పిసాదచైతన్య మొసగి । యట్టిచరలింగమూర్తియాయాప్రసాది । కెనగగౌరవ మెసగిన బసవలింగ. ౨౦౪

ఆత్మజాగ్రదవస్థ మైస్థూలభూత సచ్చైతన్యమగుచు విఖ్యాతినుండు ! నా త్మకంఠమున స్వప్నావస్థమై సూక్ష్మభూతచైతన్య విస్ఫూర్తినుండు । నాత్మ సుప్తావస్థనట నాభితలమున చైతన్య శూన్య విశ్రాంతినుండు । నాత్మసర్వావయ వాన్వితమగుచు తుర్యావస్థమైనట్ల యణగియుండు । జనునవస్థాంతరనిమిత్త జనితక ర్మ । ములుతదారంభదేహసంభోగవేళ । నర్పితము జేసిబొందు సుఖాతిశయ ము । నెసగుచుండు ప్రసాదాత్మ బసవలింగ. ౨౦౫

అలరుజాగ్రవస్థనఖిలేంద్రియములు నివేదించి బొందుప్రసాదికర్మ । వితతు లుస్వప్నావగతనుతైతలలెత్తగాతదీయో పభోగప్రసక్తి । గదలని భూతసూక్ష్మ ములచే నారంభమైన యంతర్దేహమంగలింప । తత్కర్మపటలముదగనమ ర్పించి స్వప్నమున బొందుదు రీఘనప్రసాది । గలలను స్మేషస్థాను క్రమములగుట। నవియునర్పించి బొందునిరంతరప్ర । సాదిబొందంగ నేర్చునే జడయు నుడిగి । భ్రమయు వెరపును మరచియు బసవలింగ. ౨౦౬

అనుదినపూర్వనిదార్పితశివలింగగర్భముదిత సుఖా కరింద నేంద్రి । యములుసద్గురుకృపాయత్తరాజసగుణ సన్నిధినాయుషత్స్వవనవేళ । పరిభవించి నియమిత ప్రాణలింగ స్పర్శనాంతరంబులనుదినాంతరంబు । కలయసద్గురుసాత్వి కప్రసాదైక్య సుస్థితిపదార్థక్రియార్పిత సుఖంబు । లొసగుచు తదీయసుగుణ తామసగుణవి । సాదసమరసహితభావాదిలింగ । గర్భమునవిశ్రమము బొంద గాప్రసాది । కెసగ నుపచారములు నొప్పబసవలింగ. ౨౦౭

అదిదైవమాచార్యుడధ్యాత్మమైనట్టియదిభూతమగుపరమాత్మలింగ।మాపరమాత్మ జీవాత్మసంగతికుపాధానంబు ప్రాణమాధారమనగ । నాప్రాణమును సంగమంబ గు సత్ప్రాణమాత్మ ప్రాణనిరూఢియట్టిత్రిపుటి । యందు సద్గురుని వాక్యార్థంబున మ్మి మాయాదిలవ్యతిరిక్తమగుచు నాత్మ । ప్రాణలింగాంగమదన సంబంధలీల । దనరప్రాంగణములు ప్రసాదములుకాక । మాన నేంద్రియములు నందమగ్నము లుగ । నెసగుసుఖములుప్పలకు నెద్ది బసవలింగ. ౨౦౮

ఆదిదైవమాచార్యుడది భౌతమిష్ట లింగార్పిత శబ్దమధ్యాత్మమదియు । న

దిదైవమాచార్యుడది భూతమిష్టలింగార్పిత స్వర్శమథ్యాత్మ నేత్ర - మదిదైవమాచార్యుడది భూతమిష్టలింగాత్మ స్వరూపమథ్యాత్మ దేహ - మదిదైవమాచార్యుడది భూతమిష్టలింగార్పితరుచ్యమథ్యాత్మ దేహ - మదియఃఘ్రాణమథ్యాత్మనిర్మాల్యగంధ-మట్లనదిభూతమదిదైవమాగురుండు- యగుప్రసాదాది బుద్ధేంద్రియాత్మవిషయ - భరిత సుఖమల్పులకు నైద్ది బసవలింగ. ౨౦౯

అదిదైవమాచార్యుడది భూతమిష్ట లింగార్పిత కవితమథ్యాత్మ వాక్కు--అదిదైవమాచార్యుడది భూతమిష్ట లింగార్పితదాన మథ్యాత్మపాణి - అదిదైవమాచార్యుడది భూతమిష్టలింగార్పితాలాపమథ్యాత్మపాద - మదిదైవమాచార్యుడదిభూతమిష్ట లింగార్పితసహిత మథ్యాత్మపాయు - యదియునుయుపస్థయిష్టలింగార్పితంబు। మరియునుత్సర్జన క్రియల్ దొరలుచుండ - పరగకర్మేంద్రియాఫలగురుప్రసాద - భరితసుఖమల్పులకు నైద్ది బసవలింగ. ౨౧౦

వినియెడు శోత్రిముల్ వినుటయు వినబడుశబ్దజాలంబు చచ్ఛ్రివణసుఖము - పొందెడు త్వక్కును బొందుటయును బొందుస్పర్శంబులును తదానంగ సుఖము - కనియెడు నేత్రముల్ గాన్పించుగాంచురూపములు సద్వీక్షణా స్పదసుఖంబు - అనియెడుజిహ్వయు వానుటయును నానురసము తదీయాచరణసుఖంబు - మూర్కొనందగుఘ్రాణంబు మూరుకొనుట । మూరుకొను గంధముననుతత్సముదితసుఖము । నర్పితము జేసిబొందు మహాప్రసాది - నైనగు సుఖమల్పులకు నైద్ది బసవలింగ. ౨౧౧

షట్స్థలాంతైకవింశత్సహస్ర స్వరార్పణము ప్రాణక్రియార్పణమువలన - శ్వాసనిశ్వాసాంగ పోషణార్పణ మపానవ్యాన మరుదర్పణంబువలన - దనుజేష్టశాలు వర్ధన ముఖార్పణముదానసమానపవ నార్పణంబువలన - నిష్ఠీవనోన్మేషనిమిషార్పణంబులు నాగకూర్మసమార్పణంబువలన - క్షుత్పిపాసాదివరిశిష్టగుణసమర్ప - ణముకృకరదేవదత్త ధనంజయార్ప - ణములనగుదశప్రాణార్పణములనతని - కెసగులింగార్పణమునన బసవలింగ. ౨౧౨

అజనశిరోజశల్య స్నాయుముఖకఠిణార్పణబుద్ధి సమార్పణమున - లాలాసురుధిరశుక్లమూత్ర మజ్జామల ఖార్పణమునననుసమర్పణమున - క్షుత్పిపాసాఖ్యసుషుప్తి సంయోగముఖార్పణ తేజస్సమర్పణమున - నానాసుయోగమనాగ

మననిరోధార్పణవాయు సమర్పణమున - గామముఖ్యమోహాంతనరిగతిభయాన -
మర్పణమునాకాశసమర్పణమున - అట్టిభూతార్పణంబు నాత్మార్పణమున - నె
నగు మీప్రసాదంబయి బసవలింగ. ౨౧౩

తలపించు మనసును దలచుటయు దలంచు దలపులు మరిసముద్గత సుఖం
బు । పలికించు వాక్కును బలుకుటయును బల్కు పలుకులు తత్సముద్భవ సుఖం
బు । జరియించు కాయంబు జరియించుటన్జేత చరియించదగు సముచ్చయ సుఖం
బు। జేయుకర్మంబులు జేయుటయును జేయనగుచెయ్వులునుదన్నితాంత సుఖము।
చెలగిచెల్లించు నాత్మయు చేతనమును । చేతనాధిష్ఠిత క్రియాతీత సుఖము । నర్పిత
ము జేసిబొందునుద్యత్ప్రసాది । కెనగ సుఖమల్పులకు నెట్లు బసవలింగ. ౨౧౪

మున్నుబలికిన పలుకుచున్న పలుకగగోరుచున్న వక్తవ్య సముదిత సు
ఖము । మున్నుముట్టిన ముట్టుచున్న ముట్టగగోరుచున్న స్పర్శవ్యసముదిత సుఖ
ము । మున్నుచనిన చనుచున్నచనగగోరుచున్న గర్తవ్యసముదిత సుఖము । ము
న్నునల్పిన నల్పుచున్న నల్పగగోరుచున్న గర్తవ్య సంయోగ సుఖము । మున్ను
యెరిగిన నెరుంగచున్న నెరుగ । గోరుచున్న సుబోధ్య విచార సుఖము। ప్రబలునం
తవ్య సుఖసమర్పణము జేసి । యెనగు జెందు ప్రసాదియ బసవలింగ. ౨౧౫

అచలేంద్రియము శ్రోత్రమవిషయముచంద మదియు దానికి నింద్రియార్ప
ణంబు । నచలేంద్రియము నేత్రమవలన విషయంబులవియింద్రియద్వితీయార్పణం
బు । నచలేంద్రియమ్ముత్వక్కుచరించు విషయమునదియింద్రియతృతీయార్పణంబు।
నచలేంద్రియము ఘ్రాణమవిషయంబును యదియింద్రియ చతుర్థయార్పణం
బు। రసనచలేంద్రియంబు చరంబువిషయ । మదియనటు గూడవంచేంద్రియార్ప
ణంబు। జెందుకొలికియ దానిచ్చుజెందుకొలికి । నెసగునెరుగ ప్రసాదియా బసవ
లింగ. ౨౧౬

అచలేంద్రియము వాక్కు వచనము దగచరంబదియు నింద్రియత్వదీయార్ప
ణంబు । నచలేంద్రియము పాణియచలంబు తత్క్రియలవియింద్రియత్వదీయార్ప
ణంబు। నచలేంద్రియముము పాదమచరంబు దక్రియలవియంద్రియద్వితీయార్ప
ణంబు । నచరేంద్రమము గుహ్యమచరమయ్యాన ందహ ఇంద్రియద్వితీయార్పణంబు।
మనసునచలేంద్రియంబునంస్మరణమచర।మదియునటుగూడవంచేంద్రియార్పణంబు
జెందుసుఖమును దానిచ్చిబొందుసుఖము । నెనగువాడె ప్రసాదియ బసవలింగ.

సర్వాంగములు లింగసన్నిహితంబుగ లింగంబునయ్యంగ సంగతముగ ప్రాణంబులింగాను బంధంబుగాగ నాలింగంబు ప్రాణానుసంగతంబు । లీలనింద్రియములు లీలసంగంబుగా లింగంబునింద్రియసంగతంబు । సన్మనంబునులింగ సన్నిహితంబుగా లింగంబుదన్మనః సంగతముగ । నట్లనన్యోన్యవ్యసాహృదాహ్లాదభరిత । సమరసానంద సత్సుఖసహితహితన । మాహితాన్యోన్యగర్భ విహార కేళి । నెనగువాడె ప్రసాదియు బసవలింగ. ౨౧౯

నీనేత్రలింగసన్నిహితమై నేత్రంబులర్పించు రూపలతాంతములను నీశ్రోత్ర లింగసన్నిహితమై శ్రోత్రంబులర్పించుశబ్దలతాంతములను। నీఘ్రాణలింగసన్నిహితమై ఘ్రాణంబులర్పించు గంధలతాంతములను। నీయంగలింగసన్నిహితమై త్వక్కుదానర్పించు స్పర్శలతాంతములను । నీదుజిహ్వయులింగసన్నిహితమగుచు । పూజనసేయుచు నతుల్యజపత్రపుష్ప। మట్లదాల్చును నిర్మాల్యమాప్రసాది । భక్తినదనేంద్రియంబుల బసవలింగ. ౨౨౦

ముఖ్యరూపార్పణోన్ముఖమగు లింగసన్నిహిత నేత్రంబులుని న్నెజూచ్చి ముఖ్య గంధార్పణోన్ముఖమగు లింగ సన్నిహిత నాసికమును నిన్నుజూచ్చి ముఖ్యశబ్దార్పణోన్ముఖమగులింగ సన్నిహితకర్ణంబులనిన్నుజూచ్చి । ముఖ్య సార్పణోన్ముఖమగులింగసన్నిహిత రసజ్ఞయునిన్నుజూచ్చి । ముఖ్యసంస్పర్శనార్పణోన్ముఖతలింగ । సన్నిహితమాశరీరంబు నిన్నుజూచ్చి । యర్పితము జేసి బొందు సుఖానుభూతి । నెనగువాడె ప్రసాదియు బసవలింగ. ౨౨౧

ముఖ్యవాక్యార్పణోన్ముఖమగులింగసన్నిహిత వాగ్వ్యక్తియునిన్నుజూచ్చి వ్యక్తసన్మదనార్పణోద్యుక్తి లింగసన్నిహిత మానసములు నిన్నెజూచ్చి ముఖ్యక్రియార్పణోన్ముఖమగు లింగసన్నిహిత పాణిస్థితి నిన్నుజూచ్చి। ముఖ్యదత్తార్పణోన్ముఖమగులింగసన్నిహితకర్మ లనిన్నుజూచ్చి । వ్యక్తసన్మద నార్పణోద్యుక్త లింగ । సన్నిహితమాన సంబులనిన్ను జూచ్చె । యర్పితముజేసి బొందుసుఖానుభూతి నెనగువాడె ప్రసాదియు బసవలింగ. ౨౨౨

వసువర్ధన, నిమిత్తవాగ్దమనోద్ధూలావతుల్యాండంబులంటె నేని । భిన్నటోత్కటరసోపేత పాకంబు వచనవహ్ని యాహుతిగొనియె నేని।ధరవరదేవతావర లింగబాహ్య వ్రతభ్రష్టులును మరిదాకెనేని । మశక పిపీలికా మక్షికాముఖ

జంతుచీమ రాద్యుపహతుల్ జెందనేని। రంధ్రపోఁగఁడ భాండవిరచితమేని । యవిని షిద్ధపాకాన్నముల్ భవసమర్ప। ణార్పణముగావు జూడననర్హమగును । భవము గాదెదలంపగ బసవలింగ. ౧౧౨

ద్రవ్య శ్రీవణ సంస్మరణ దర్శన స్పర్శ నాదిరుచ్యంత రూపార్పణంబు। పిండితముద్గల పృథుకబళాభ్యంతరాన్వితభక్ష్యభోజ్యార్పణంబు। శాఖరసద్రవ్యష డ్రస సూపోదనాన్యోన్యపరిమిశ్రితార్పణంబు । తత్పదార్థాన్వితతత్ఫలావృత సుల తాఖినియుక్తి సమర్పణంబు । భక్ష్యభోజ్య లేహ్యపానీయ చోష్యము । ఖా నుభవ కలాసమర్పణంబు । గాలికి యెరుగకున్న గూడునె లింగాను భవగుణాఢ్యు డగునె బసవలింగ ౧౧౩

మశకభృంగ పతంగమక్షకస్పర్శమాజాలమూషికముఖాసక్తవృష్టి । వీర వ్రితాచార విరహిత ప్రాజ్యాది ధర్మాన్వితా ద్వైకకర్మదృష్టి । ప్రజ్ఞిభోజన యుక్తపరిజన స్వకుటింబి భార్యా ప్రసాదాన్నపానదృష్టి । వాక్క్రియామానస వ్యాప్తవిజ్ఞాపనాసావధానేతరసత్వదృష్టి।చేతనుపహతంబు జెందుసుతమరియన్య । మిశ్రితంబుగాని మీదుపూని । శుభతరప్రసాదసువిధానిగాక గో । ప్యప్రసాదియ గునె బసవలింగ. ౧౧౪

పాకశాసనలోన బడునాలితీపులు ఖండితస్వరములు గదియనీక । దర్విశ్వా కృతులు దగదల్పిలోజాలకునడ పాటురూపులు సుడియనీక । నానాన్నపానపు నస్పర్శన భ్రాంతి పొందిడి చేముట్టిబొనగనీక। దర్వీచికబళింపదనుజొచ్చి కదువ డి బోపునోరూరుల బొరలనీక। మనసునింద్రియ వ్వత్తి చే మరగనీక। చిత్తమింద్రియముల జెంతజేరనీక। నీకుయర్పించు భోగించునియతిలేక।నెనగునెబ్రసాదసౌ ఖ్యంబు బసవలింగ. ౧౧౫

ద్రవ్యముల్ బంధించుతరిమరి వానివైనత్తిగా వించక విత్తనోరు । నము లక బెదవులునాకక యుమియక చప్పరించక లాలదప్పిగొనక । జిరుదగ్గుదగ్గక జిహ్వసారింపక బెదవులు దడపక యాదరనీక । గ్రుక్కిర్లుమ్రింగక బిక్కబి ల్వక యాత్మజీవసంయోగము జెడగనీక । బరగనర్పించు సంభ్రమపడక దుడుకు పడచుబరికించకనునిజాపాదిగుణము। లెద్దిజాపక వర్తించు బుద్ధివంతు । నెనగును బ్రసాదసౌఖ్యంబు బసవలింగ. ౧౧౬

శుద్ధాన్నపానముల్ శోధించిశోధించి స్వామికిపడ్డించుచట్టువంబు। భవ్యమై విలసిల్లు భస్మసంస్పర్శ గాఢ్రాణేశునకు నిడువళ్లెరంబు। కర్తకు తబ్రుచుల్ కడిజే సిగడిజేసి గుడుపుతస్నానసాంగుళ పుటంబు। నాదునాలుక నాలుక నాదునాలుకనా లుక నాలుక నాగలనాలుక నాజరించి। బొనగతబ్రుచులెల్లను బొందుపరచి। సంతసమునిస్సుమనము ససంస్మరించి। అసమబుద్ధిని యిష్టలింగార్పణాది। వసతి గనిన ప్రసాదియె బసవలింగ. ౨౧౭

లింగసాన్నిధ్యంబు లింగాకితంబేని స్వామిభృత్యత్వంబుచర్యయేని। సకల పుణ్యోదయక్తినముచితక్రియయేని యింద్రియస్వర్శంబు యిష్టమేని। అవధానసువి ధానమభ్యాసమంబేనివిషయ స్వతంత్రంబు విషయమేని। కలితప్రసాద భోగాను శ్రితంబేని నిసజూచ్చియునికియమనికియేని। సట్టిపూజకునకు మహాదిట్టసైన। ఫల ముగల్గును దప్పక సలలితముగ। గాధజెందక దాభవాంబోధివిడచి। పరమసు కృతంబుజెందడె బసవలింగ. ౨౧౮

ఇవ్వడేశబ్దంబు లిచ్చినీకది నీవదెచ్చి శ్రోత్రములచే యిచ్చియిచ్చి। యివ్వ డేస్పర్శంబు లిచ్చినీకది నీవదెచ్చి దేహంబుచేనిచ్చి యిచ్చి। యివ్వడేరుచ్యంబులి చ్చినీకది నీవదెచ్చి రసజ్ఞతనిచ్చియిచ్చి। యివ్వడేవాసనలిచ్చినీకదినీవదెచ్చి ఘ్రా ణంబుచే యిచ్చియిచ్చి। యివ్వడెవ్విషయదలపగనిచ్చియట్టి। యడసుమది తృష్ణగొ నకను గడన జెడక। నెంతయును సర్పణముజేసి యింపుమీర। నెసగను ప్రసా దఫలమూనె బసవలింగ. ౨౧౯

జూపక జూడక జూపకజూచినకనులవందువగనుకలకలేక। వినుపింపకవి నకవినుపింప వినినువీనులకునుమరివెరపులేక। అంటింపకంటక నాడింపకుండిన చేతు లదండిగా ఖీలిలేక। నానింపకానక నానింపకానిన జిహ్వకు ధట్టమైచింతలేక। నీకమూరుకొనక నీకమూర్కొనిన ఘ్రాణంబువందువుగ భయంబులేక। నన్నివిషయము లను పన్నుగాదెలిసిన। వాడుబ్రసాది బసవలింగ. ౨౨౦

ఆరాధ్యదేవున కర్ణార్పణముజేసి కరమర్థిలింగజంగమముబడసి। నలి దేశికునకు ప్రాణసమర్పణంబాది గావించిప్రాణలింగంబువడసి। మొదలశ్రీగురు లింగమునకుశరీరార్పణము జేసి గదుబ్రసాదమును బడసి। ఆచార్యవిభునకు నా త్మార్పణముజేసి భవ్యజీవన్ముక్తిబడసియట్లు। చనకప్రాణంబుయర్థంబుదన శరీర।

మనసిజాత్మయువంచింప మొదలజుట్టి। మగుడగాక తత్తనూలాభమానసునసు।
పొనగనుప్రసాద సుఖమబ్బు బసవలింగ. ౨౩౧

శ్రీగురుమూర్తికర్పించిన తనువ నర్పితభోగమునకు నైబెట్టడేని। ఆరాధ్య
దేవున కర్పితంబైన ప్రాణంబు నర్పితవిధి నడచెనేని। ఆరాధ్యదేవునకర్పితంబైన
మానసమర్పితంబుగా నెనగెనేని। తద్దేశికేంద్రార్పితంబైన సర్వార్థములునర్పి
తంబుగా బొలసెనేని। అరసిజూడనీవును మరియావ్రసాది। యనుబ్రసాహోక్తిభ
క్తుల మనుచు మరియు। చెలగి యర్పింప భోగింప సిగ్గుగాదె। భక్తవత్సల సద
యాత్మబసవలింగ. ౨౩౨

ఆత్మస్వతంత్రలింగా నర్పితంబును కాలాహికాహుతి గాకయుండ। సం
గమయ్యంగ లింగానర్పితంబును దండపాదోద్వృత్తిదాకకుండ। ప్రాణంబుప్రాణ
లింగానర్పితంబైన మానసార్పితముగ మగ్నమగుచు। దంభోళిహతిచేత దలగక
యుండశైలంబు భాతినినిబ్బరంబుగాగ। నయ్యభవదీయగర్భాబ్ధిశయ్యనునిచి।
సావధానార్పణంబులనవధరించి। నితరభవ్య ప్రసాదంబు నియతియనిన। బ్రతుకు
గలదె ప్రసాదికి బసవలింగ. ౨౩౩

దేశిక సాంగోపదేశ మంత్రంబు ప్రసాదముశబ్దమా శ్రయముగాగ। నారా
ధ్యదేవు శ్రీహస్త మస్తకయోగమది ప్రసాద స్పర్శమాదిగాగ। నాచార్యవిభుని
కృపావలోకనకు బ్రసాదావలోక నాస్పదముగాగ। సద్గురులింగ ప్రసాదాను
భూతికిఘనతరంబైనట్టి జననిగాగ। నాప్రసాదికి నాదిగానట్లుచనక। గురుచరే
శ్వరసాదసంస్మరణగాక। నితరమయినట్టివేరెసద్గతులుమరియు।బ్రతుకుగలదె ప్ర
సాదికిబసవలింగ. ౨౩౪

స్వామినీనేత్రి ప్రసాదదీప ప్రభాసంగతి నేత్రపతంగమణచు। స్వామినీశ్రో
త్రి ప్రసాదసుషిరనాదసంగతిశ్రోత్రభుజంగమణచు। స్వామినీనాసాప్రసాద చం
పకగంధ సంగతి నాసికాభృంగమడగు। స్వామినీకాయ ప్రసాదరూగ స్పర్శ
సంగతికాయమతంగమడగు। పరమపావనమీప్రసాదరసభుక్తి। నాప్రసాదజిహ్వామ
త్స్యఃబడంచు। గాననితరదుర్విషయాక్రాంత మణచు। భక్తి విషయేంద్రియంబులు
బసవలింగ. ౨౩౫

ననుగాననవిననికర్ణములు గదాయనిశ్రోత్రిప్రసాదంబుజొనపకున్న। నను
గానిబొందనితనువు గదాయని కాయప్రసాదంబు గ్రిమ్మకున్న। ననుగానబాడని

కనులుగదా యని నేత్రప్రసాదంబు నెరుగకున్న । ననుగానరుచిగను నాల్కగదా యనిజిహ్వప్రసాదంబు జేర్పకున్న । గంధమన్యథాయనగనీఘ్రాణమిదియ । యనుచు ఘ్రాణప్రసాదంబునిసుపకున్న । నీవునావాడు వీడని బోధివకున్న । బ్రతుకుగలదె ప్రసాదికి బసవలింగ. ౨౩౬

నీకువాహనములై నీలోనజరియించు మచ్చికనరులు సమర్పణముగ । నీకు పాదములునై నీలోననడుచునయ్యడుగుల కడుగు ల్సమర్పణముగ । నీకుపర్యంకమై నీలోనశయనించు నూర్పుకూర్పులును సమర్పణముగ । నీకుగద్దియయయినీలోనగూర్చుండు మాటకుమాటసమర్పణముగ । పంచభోజనాకృతి నుండిపంచవిషయ । మానితసుఖార్పణముగ నీలోనమరియు । నణగుచిత్త ప్రసాద దేహస్థుశొందు । యనమ సుఖములుదలచునే బసవలింగ. ౨౩౭

లింగపీఠంబగు నంగంబుఘ్రాణేంద్రియము మజ్జనము జేసియలవరింప । గంధపుష్పాదులు ఘ్రాణేంద్రియంబద్ది యొకిఁంచిధూపంబు లిచ్చివరుస । నేత్రేంద్రియంబదినీరాజనము దగ రసనేంద్రియం బొగిరసములిచ్చు । వాగేంద్రియమునిన్ను వర్ణించుశ్రోత్రేంద్రియమువినుపించు గుణాంకనములు । నట్లయిష్టలింగార్చనంబాచరించు జనుతదీయప్రసాదాత్మసౌఖ్యమొందు । నవిరళేంద్రియ స్వాధీనుడగుప్రసాది । భక్తియతేంద్రియంబుల బసవలింగ. ౨౩౮

లోపంబులేక విజ్ఞాపింపకున్న తద్విజ్ఞానమును నీవు వినకనున్న । నంటినరూపంబు లర్పింపకున్న నీవటుల నేత్రేంద్రియమంటకున్న । నానకరుచులవధానిమైయీకున్న పూనితద్విషయాదులానకున్న । నవియును నినుబోల్చియనుభవింపకనున్న నీవుయిట్టుల గరుణింపకున్న । నాప్రసాదియు నీవనాకనకనున్న । నేనునీకనినీవునుబూనకున్న । నమముగాకనుయిరువదోషంబుకలిమి । బలిమినర్పించునైకొన బసవలింగ. ౨౩౯

వినగనేరదు నీవువినుపింపక ప్రసాది వినుపింపకయు నీవువినవతండు । ముట్టనేరదు నీవుముట్టింపక ప్రసాదిముట్టించకయు నీవుముట్టవతడు । చూడనేరదునీవుజూపకయె ప్రసాది జూపకనీవును జూడడతడు । నాననేరందునీవానింపకప్రసాదియా నింపకయు నీవనానవతడు । దావిగొనరట్ల నీవునతండుగాన । ప్రీతుల నిరువురనన్యోన్యవర్తనముల । జందమెరుగక నిరువుర బొందుబడక । నెనగుపాదసుఖంబులు బసవలింగ. ౨౪౦

వినువింపకనుదాను వినగరాదెల్పియు వినక వినుపింపక వినకరాక । జూచిజూపకయున్న జూడగాదెల్పియు జూడగజూచియు జూడదగదు । ముట్టిముట్టింపక ముట్టరాదెల్పియు ముట్టకముట్టింపముట్టగాదు। మూరొ్కనియూకున్న మూరొ్కనగాదు మూరొ్కనక నిచ్చినను మూరొ్కనగరాదు । యారగించియూకుండిన నారగింప । కిచ్చినగొనంగరాదు పంచేంద్రియాదు । లైనవిషయముల్ చేకొని యవధరింప । కెవగగ ప్రసాది ధర్మంబు బసవలింగ. ౨౪౧

జూడకర్పించిన చూటుకలు దనియవు జూచియర్పించిన జూడవీవు । ముట్టకర్పించిన మును జెందనియ్యవు ముట్టియర్పించిన ముట్టవట్లు । వినకనర్పించిన వీనులదని యవులిని సమర్పణ సేయ వినవునీవు । నానకర్పించిన నట జిహ్వదనియవు యానియర్పించిన నానవట్లు । ఘ్రాణమునమర్పించు వేటకయుదునమున । నింద్రియముల నష్టగజాల నెట్టులనక। పొందకయు పొందిపొందించుబొందుస్వాను ।భవసుఖంబల్పులకు నెద్ది బసవలింగ. ౨౪౨

తన నేత్రములు దనమనసునమనసును నేత్రంబులందు నిర్ణీతమయ్యె । దన శ్రోత్రములు దనమనసు శ్రోత్రములు నీశ్రోత్రంబులుండ విశ్రుతములయ్యె। దన ఘ్రాణమునుదన మనసు ఘ్రాణమును నీఘ్రాణంబునందు సంక్రమణమయ్యె । దనజిహ్వయును దనమనసుజిహ్వయును నంగము భవిజిహ్వంగ కలితమయ్యె । గానతత్స మర్పణమానుగాక । ననకనినుజొచ్చియును సోహమునకనలరు । నవ్యయాతీతుడైన దివ్య ప్రసాది। కెసగు సుఖ మల్పులకునెద్దిబసవలింగ. ౨౪౩

నీకుయర్పించియునినుముట్టదనుమ ట్టముట్టింపముట్టింపముట్టునవియు । నీకునర్పించియు నినుజూచుదనుజూచుచూపంగ జూచునీజూచునవియు ।నీకునర్పించియునినువినుదనువిను వినుపింపవిననీవు విన్నవనియు । నీకునర్పించియు నినిజెప్పదనుజెప్ప జెప్పింప జెప్పనీ జెప్పనవియు । నర్పితము జేసితనని జూపాంగసాంగ । ములలను త్రికృంగములు దాల్చుముట్టినట్లు । దలచునర్పించు నిన్నును దన్నుస్వాను । భావసూక్ష్మ ప్రసాదిదా బసవలింగ. ౨౪౪

అధిపు నుద్దేశించియర్ఘ్యోదకము లిచ్చుతరి మీదుబోవునె దాఁవకున్న । భూతేశునకు దివ్యపుష్పముల్ బెట్టుమాత్రాన బోవునె మీదతాల్పకున్న। కర్తనుద్దేశించి గంధంబుజదివియు నప్పుడుమీదబోవునే పూయకున్న । స్వామినుద్దేశించు

శాకపాకములు:, వేదనమానెయర్పించకున్న । ననచుబొందుగశైత్యాదులన్ని
య । మిశ్రితేంద్రియములచేరి మీదబోవ । ముట్టునేనీవు ముట్టకమును
ది । వట్టునో యిచ్చునో కొనును బసవలింగ.

శబ్దక్రియార్పణా నక్తి నల్లింగ కర్ణముల ప్రసాదికర్ణముల జొచ్చి । రూ
క్రియార్పణా రూఢినల్లింగ నేత్రముల బ్రిసాదినేత్రములుసొచ్చి । స్పర్శార్పణ
యాఘ్రాణి నల్లింగగాయమున ప్రసాదికాయంబుసొచ్చి । రససమర్పణ కళార
ణ నల్లింగ రసజ్ఞ ప్రసాదిరసజ్ఞసొచ్చి । యానమర్పణభావమందేకదృష్టి ।
తద్విషయంబులు సలలితముగ । దెలిసివర్తించువానికి ధీనయుక్తి । కెసగుమ
సుఖంబులు బసవలింగ,

అన్యోన్య కాయస్థమై పరకాయ ప్రవేశస్థితి నుడఖ్లు వీడువడక । ప్ర
ప్రతిష్ఠాను బంధలీలాచార విస్ఫూర్తిబాణముల్ వీడువడక - నర్పితతనుకృతా
త సంగతి ప్రసాదవివిధోద నాదులు వీడువడక - భరితావధానానుభవని
రరతి విషయేంద్రియంబులు వీడువడక - పరశివవిభూతి సుఖపరంపరవితా
వేలసద్దాన దానముల్ వీడువడక- సమయగతలింగ లింగప్రసాదమదన -
గునై ప్రసాద భావనబసవలింగ.

అగునిర్వ్వరకును నన్యోన్యేంద్రి యంబులన్యోన్యభాజనములైయవధ
నగునిర్వరకును నన్యోన్యచ్ఛాయంబుల న్యోన్య హస్తంబులైయదికొనంగ.
గు నిర్వరకును నన్యోన్యేంద్రియంబుల నోన్యవక్త్రింబులై యనుభవింప.
గునిర్వరకును నన్యోన్యేంద్రియంబులన్యోన్యేంద్రియంబులైయనుమతింప- న
నిర్వరకన్యోన్యేంద్రియములమిశ్ర - మములనన్యోన్య గర్భగేహములుగా
దివుటలింగంబు తత్ప్రసాదియు మదించు-భావసూక్ష్మంబులెట్టివోబనవలింగ.

శబ్దరోగిరము ప్రసాదిశబ్దంబుబళ్లైరము యుష్మచ్ఛోత్ర వళ్లైరము
స్పర్శరోగిరము తత్సర్వాంగగతియు వళ్లైరము ద్వితీయాంగలింగమునకు
మోగిరంబు తఘ్రాణంబు దానపళ్లైరము భవఘ్రాణలింగమునకు - రస
రంబుతద్రసనాగమైన పళ్లైరమును రసనాంగలింగమునకు- జూపుగాత్రరో
ది రూపుమీకు - నయనలింగంబుగాగ మనంబుచేత - నర్పణముజేసియును
ద్రియములుదనకు - బళ్లైరముగాగ బోగించు బసవలింగ.

గురులింగజంగమాకుంతితోఁపాస్తిని బడుస్వామి భృత్యసంబంధితనువు - సహజైక లింగనిష్ఠామహిష్ఠము బాలుబడువీర భక్తి నంబంధిమనసు - విరచితాను శ్రుతచరసైక భావన సంధిల్లు శరణసంబంధిబుద్ధి - బాహ్యంతరార్పిత గ్రాహ్య ప్రసాదసంబంధమాయింద్రియపంచకంబు - ప్రాణలింగప్రమదన సంబంధితమ రు - ప్రాణలింగైక్య సుఖతమాంగాత్మమధ్య - సర్వసంబంధిలింగ ప్రసాదియున గ - బడుసుషట్స్థ లసంబంధి బసవలింగ. ౨౫౦

నీవు జూడగజూచు నీవునూకగ నూకుజూపులు రూపులు రూపపితతి - నీవుమూరొగ్గన గొనునీవు నూకగనూకుఘ్రాణంబు ఘ్రాణదుర్గంధచయము - నీవు వినగను వినునీవునూకగనూకు శ్రవణముల్ శబ్దాదిశబ్దచయము - నీవానగానా ను నీవునూకగనూకురసనయు రసము నీరసమునట్ల - నీవబొందంగ బొందును నీవనూక - గరిమదక్కగనునూకంగ కఠినములును - యిష్టలింగప్రసాదము నెన్న రుగువాని - కెనగు సిద్ధనిషిద్ధముల్ బసవలింగ. ౨౫౧

గంధమైనను నీవు గంధింపకున్న దుర్గంధంబుగాక సుగంధమగునె - రూ పమైననునీవు రూపింపకున్నను రూపంబుగాక స్వరూపమగునె - శబ్దమైనను నీవు చనకున్న వినకున్న శబ్దంబుగాకవి శబ్దమగునె - రుచ్యమైనను నీవురుచింపకు న్నను రుచ్యంబుగాక నరుచ్యమగునె - యట్లనేయుండగా నెవ్వడైన నాప్ర - సాదిదెలియదెమరిసుగంధాదిచయము - నేలబొందడు సద్గంధ మెరిగినట్టి - ప్రా ణ లింగాంగి జగమున బసవలింగ. ౨౫౨

కానిదుర్గంధముల్ గావని దెలియగానంత నెబొందున నర్పితములు। కానికుశ బ్దముల్ గావని దెలియగ్గానంత నేబొందున నర్పితములు। గానికురూపముల్ గావని దెలియగానంత నేబొందున నర్పితములు - కానినీరసములుగావని దెలియగ్గానంత నే నేబొందున నర్పితములు । అయిన గంధాదులైన కాననిమెఱుంగు । నంతలో న నెబొందున నర్పితములు । కావనంగకొననగును గైకొనంగ । భావనంశుద్ధిగా దెఱో బసవలింగ. ౨౫౩

అయిన సుగంధాదు లర్పింవగాని యనర్పితదోషంబు నదియొకండు - గై కొనరాని దుర్గంధాదులాని ననపవిత్రదోషంబు నదియొకండు- పొందకబొందెడు పొందెరుంగక బొందునజ్ఞానదోషంబు నదియొకండు - నవుగాదనుట భ్రాంతి

యగుచు దానటుబొందు నద్వైత దోషంబు నదియెుకండు - నిన్నుబొందివర్తింప కదన్నుమరచి - మరువ కర్పితములు నిష్టమరగియున్న - నాస్వయంకృతదోషం బునవియునాల్గు- నెనగనిటు బొందవు ప్రసాది బసవలింగ. ౨౫౪

భవదభిషేకాంబు పార్శ్వధారకరో సలిల తరంపరానలిలనమితి - భవదీయ పూజనాప్రినవపాశ్వోవరి ప్రినవవరంపరాప్రనవచయము - యుష్మదర్పిత సిక్తయుక్తపార్వాంతరస్థిక్థవరం వరాస్థిక్థవితతి - యుష్మదీయసమర్పితోవనకాంతనదప్రినవరంపరాభిరాజియందు - స్వామినినుముట్టినవియ ప్రసాదమాత్ర - సాద మిశ్రితమదీయ నివేదితంబు - నానగైకొను దకుముఖ్యప్రసాది - భావసూక్ష్మంబదెట్టిదో బసవలింగ. ౨౫౫

శ్రోత్రప్రసాదంబు శోత్రంబనక దకన స్వేంద్రియములకనర్పితములు - నేత్రప్రసాదంబు నేత్రంబనక దకన స్వేంద్రియంబుక నర్పితంబు- ఘ్రాణప్రసాదంబు ఘ్రాణంబునకుదక న స్వేంద్రియంబుక నర్పితంబు- జిహ్వప్రసాదంబు జిహ్వకుదకన స్వేంద్రియంబులకు న నర్పితంబు- అట్లనీప్రసాదంబు నాప్రసాది- త్వకున కుజెందియు ననర్పితంబుగాన- చనుతదేక ప్రసాదికి ఘననియమము - భక్తివిషయేంద్రియములకు బసవలింగ. ౨౫౬

అనమర్పితమనర్పితాన్నపానాదిసంయుత భోగిఘనకిల్బిషౌఘభోగి - తావకమాత్రిన్నథ వశార్పితను బోగియవియ మిశ్రతప్రసాదై భోగి - అర్పితార్పిత భోగియ ఖిలేంద్రియజ్ఞానసర్వస్వతంత్ర ప్రసాదభోగి- యుభయార్పిత ద్వయాభ్యుదఫలగ్రసన విసరభోగి సూక్ష్మ ప్రసాదభోగి - అర్పితా నర్పిత ప్రిక్రియాక్రియాథ - లాఘవార్పితలింగగర్భార్థిపూర - మప్రసాదైకమూర్తి మహాప్రసాది - పరమసమ్మోదియవివిషాది బసవలింగ. ౨౫౭

అంగలింగానర్పితాన్న పానాదులుముట్టిన దప్పలిముట్టకైన- ఆత్మలింగసమర్పితాన్న పానాదులు ముట్టినదప్పలి ముట్టకైన - మహితనల్లింగ సమర్ప్యద్రివ్యాదులుముట్టి సహింపక ముట్టకైన - నిష్టలింగనమర్పితే తరవస్తువుల్ ముట్టినెరుంగక ముట్టకైన - ముట్టకుండినజాలు జేముట్టనీవ - బెట్టగల్గుప్రసాదంబు లెట్టులైన - నవిరళేంద్రియములనునమర్పితముగ। బరువడి గ్రహింపుచుండునుబసవలింగ. ౨౫౮

నీకుశుద్ధాన్న పానీయాదు లర్పింప శుద్ధప్రసాదసంసిద్ధిగలిగి । శుద్ధప్రసాద

సంసిద్ధార్పణము జేసి తత్ప్రసిద్ధప్రసాదంబు వడసి। తత్ప్రసిద్ధప్రసాదము సమర్పణ జేసి సుప్రసాదాత్మైక సుఖము వడసి। సుప్రసాదాత్మైక సుఖసమర్పణ జేసి భరిత సుఖాతీత పదము వడసి। యా సుఖాతీత పదముల య్యర్పణములు। దన్ను నర్పించి తన్నె కానిన్ను వడసి। యీ ప్రసాదిమహార్పితంబౌ ప్రసాది। నెనగ నేమని వర్ణింతు బసవలింగ. ౨౫౯

దానుముట్టక పదార్థములైన నర్పింపన వినీవ జేముట్టియవధరింపు। తనుముట్టనీక త ద్రవ్యములర్పింప నవియు ముట్టగ నేర్పు యవధరింపు। తానునీలోఁజొచ్చి తత్సమర్పణ సేయనతని నీలోనుంచియవధరింపు। తనలోన నినునిది తత్సమర్పణ సేయ నతనినీలో నుండి యవధరింపు। తత్ప్రసాదార్పణము జేసి తన్ను నీకు। నర్పణము సేయ నీవును నంతజొచ్చి। యా ప్రసాదంబునిను తన్మహాప్రసాది। కెనగ నర్పించు దప్పక బసవలింగ. ౨౬౦

ఇతర వాహనముల నెక్కక నర్పించుదా వాహనంబైన తత్ప్రసాది। గ మకింపమరి పాదుకము లెల్ల నర్పించు నా పాదుకములయిన తత్ప్రసాది। జండవిధములను గూర్చుండ నెట్లర్పించు దానిడ మైయున్న తత్ప్రసాది। శయనింపగా వేరె శయన మట్లర్పించు దా శయ్యయై యున్న తత్ప్రసాది। గానయర్పింప దర్పింపక యునుదండ। నణగియుండును భావలింగార్పణంబు। కొలికి యెరిగి యర్పించు నైగొను ప్రసాది। భావసూక్ష్మంబదెట్టిదో బసవలింగ. ౨౬౧

నీకునిషిద్ధాన్న పాకాదులర్పింప నతనిని వివిధభావాబ్ధి నణతు। శుద్ధాన్నములు దనత్పులి పాసార్థమై యర్పించును భయకర్మాబ్ధి త్రోవ। తాదరివస్తువులు యుష్మదర్పో పచారార్థమర్పింప సుకృతకర్మాబ్ధి దేల్తు - నవియు సాక్షాత్ప్వదభ్యవహారార్థమర్పింపనీకు గర్భాబ్ధి నునుతు - నట్లగాకపిలా విరూపితాభిమతను - భావలులు భవదీయ సుఖార్థముగన - మర్పణము సేయ తత్ప్రసాదార్పితాను - భవసుఖాంబుధి నోలార్తు బసవలింగ. ౨౬౨

అగుప్రసాదంబు వస్త్రాభరణాదులు నర్పితావధిసమోగాంతమగుట - అగుప్రసాదము పాదుకాసన। శయ్యల కర్పితావధి సమోగాంతమగుట - అగుప్రసాదము వాహనాందోళికాదులకర్పితావధి సమోగాంతమగుట - అగుప్రసాదమ్ము శస్త్రాస్త్రదండాదుల కర్పితావధి సమోగాంతమగుట - తద్వయోగ సమర్పణాంతస్తవీయ - దర్శనస్పర్శ నాన్వితధారణాంత - సుఖపరంపరలర్పించు

సుప్రసాది - కెనగుతత్ప్రసాదసుఖంబు బసవలింగ. ౨౬౩

అర్పితాహార్యములగు నన్నపానాదులకును శుద్ధిగావించు కొలికియెట్లు - నభిమంత్ర జలములనగు శుద్ధియందవాయా మంత్ర మేమిటనయ్యశుద్ధి - అప్రసాదము ముట్టనగు శుద్ధియందమామును బ్రసాదముగాని ముట్టదగదు - ఆద్రవ్య శుద్ధి జేయగ వేరెయింద్రియంబుల ప్రసాదేంద్రియంబులును యవును - గానిభాండ పాత్రస్థముల్గాకమున్న - తత్పదార్థవిశుద్ధమాదారిగోరి - యవియె దగదెచ్చియర్పించి యనుభవించు - భావమెరుగ బ్రసాదియా బసవలింగ. ౨౬౪

రూపార్పితవస్తా రూఢియు బాడియు కలశాల విభునందగానబడియె - రుద్రార్పితక్రియా రూఢంబు గూఢంబు చెన్నయ్య యందముల్ జెప్పబడియె - కడికడి కర్పించుగతియును మతియును చౌడన్న యందున జూడబడియె - సహభాజనక్రియా నక్తియుభక్తియు వీరచోళుని యందు వినగబడియె - నానరేంద్రవ్రతంబు నాయయ్యజిహ్వ - ఆగణాదీశు హస్తమాయప్పమతియు - గూడనెక్కటి యైన భక్తునకుగాక - నెసగనితరుల కౌనెఱూ బసవలింగ. ౨౬౫

దానెరిగి యర్పించు ద్రవ్యరూపము భేదమెరుగ కర్పించినయెరిగెదీవు - దానెరిగియర్పించు ద్రవ్యసురచి భేద మెరిగియర్పించిన యెరిగెదీవు - దాబాహ్యమున నర్పితముసేయు రూపంబులంత రార్పణసేయనంటెదీవు - తానంతటసమర్పితముసేయు రుచులును బాహ్యార్పణముసేయ బడెదవీవు - యందరూపనిరూపపదార్థ రుచియు - నెవ్వనే కాంతరార్పణంబొల్లవీవు - గాన బరికింపతత్వమ జ్ఞానభేద - మెసగనెరుగ బ్రసాదియా బసవలింగ. ౨౬౬

నానాస్వరూప ప్రధానార్పణము దానగాన ప్రధానమంగమున కాదియానిరూపాంగ సమర్పణమైనట్టి అంగముతత్ప్రధానార్పణంబు - తత్ప్రధానాంగవిధానతనంగేతర ప్రధాన విధానరహితయుగళి - యాప్రధానము ప్రాణమంగమంగము ప్రధానార్పణాంగ ప్రధానాధిరతికి - నాప్రధానరూపము లుభయార్పణంబు - లానిరూపసుఖంబులే కార్పణంబు - గానయుభయార్పణము పరిజ్ఞానమతికి - నెనగుతత్ప్రసాదసుఖము బసవలింగ. ౨౬౭

భవదీయఇష్టంబు భండావశిష్టంబు గుండభోగింపనే గురుడుజెప్పె - యాతవిషామృతనమస్థితి ననర్పితము మిశ్రితమును గడుసమర్పితముగాదె - అన్యద్రె

వానన్యమంత్రాన్య మార్గాన్యాన్య సంకరదోషము పమము గాదె - తమలింగమున
ప మీదటమరితడ్డింప నంద్రులింగమునకే యలతివచ్చు - నంతరార్పణమేకాని
వింతలేక - నొదగుక్షీరంబులోపల మొదవుజికక్కు - నగునైనద్భావహ్య పోషణ
మైనలింగ - బరమకృపబొందిన బ్రసాది బసవలింగ. ౨౬౮

దేవరక్షింపుచో దృష్టిగోచరములై విమలార్పణములసిద్ధములరూపు - అయ్య
వడ్డింపు చోహస్తాన్వితంబులై సిద్ధోదనాంతరసిక్త వితతి । జియ్యఅందిచ్చుచోజి
హ్వవగతములై కబళాంత రాశిసిక్తములు రుచులు। స్వామివడ్డించుచో నద్భావ
యుతములై యిరవేంద్రియ జ్ఞానమిష్టసుఖము । లర్పితములలో నీతృష్ణ తాపభ
యజ । రారుజాదిఘోరాస్త్రశస్త్రములదాల్చి। జోకజెడకనుతనక్కరలోకమెల్ల।
వెనజయిగవ బ్రసాదియా బసవంలిగ. ౨౬౯

వీనులచేత నీవీనులచేతికి నందించు శబ్దంబులా ప్రసాది।కన్నులచేతనీకన్ను
లచేతికి నందిచ్చురూపంబు లాప్రసాది । ఘ్రాణంబుచేతనీ ఘ్రాణంబుచేతికి నంది
చ్చుగంధంబులాప్రసాది । నాలుకచేత నీనాలుక చేతికినందిచ్చు రసషట్కమా
ప్రసాది। చేతచేతను దన్నునీచేతిచేత । దన్నుచేస్పర్శలందిచ్చుతత్ప్రసాది । యవధ
రించు నీవుగొనునా ప్రసాద। నవ్యశేంద్రియ మ్ముల బసవలింగ. ౨౭౦

శబ్దమర్పించుచో శ్రవణంబులటుగూడజేతులై యర్పణసేయడేని । రూపుల
ర్పించు చోచూపులన్నియుగూడిచేతులయి యర్పణసేయడేని। గంధంబులర్పించు
ఘ్రాణమంతయుగూడ చేతులైయర్పణసేయడేని । రసములర్పించు చోరసయునం
తయు గూడచేతులయి యర్పణసేయడేని । బరగ లింగాంగ నంయోగభావమొప్ప।
జెలగి విషయా దులర్పణసేయడేని । మానసేంద్రియరసములు బూనెనేని । యొన
గునె ప్రసాద సౌఖ్యంబు బసవలింగ. ౨౭౧

స్వామిత్వదీయ ప్రసాదవీనులకును వీనులు వీనులై వినికి యొనగు । నదయా
త్మయుష్మత్ప్రసాదిగన్నులకు నీకన్నులు కన్నులై కాన్పులొనగు। శరణవత్సల
నీప్రసాది రసనకు మరి రసనకు రసనయై రసములొనగు । కర్తనీదు ప్రసాది ఘ్రా
ణంబునకును నీఘ్రాణంబు ఘ్రాణమై గంధమొనగు। స్పర్శనములట్ల మరియునర్ప
ణము జేసి । బొందుమీరగ నచ్చిదానందరూప । మందునైలకొని పాదారవిందవిను
లు । డసదృశేంద్రియవ్యాప్తియా బసవలింగ. ౨౭౨

బాపంగ వలవదే భాండాదిసంగతి కటమున్నె పూర్వ ద్రవ్యాశ్రయంబు - లర్పింపవలవదే యఖిలకరేంద్రియమ్ముల నానకమున్నె పదార్థచయము - భోగింత వలవదే బొందంగబడు షడ్రసములకు మున్నె ప్రసాదసుఖము - తనియంగవలవదేదనుమనఃప్రాణ సంతృప్తికి మున్నె తదీయభుక్తి - గరికొనంగ వలవదె మరువకమున్నెమ - హాప్రసాదసత్సుఖాబ్ధిలోన - నట్లగూడదేహమూ ప్రసాదాను
సం - వృత్తిగూడవలదె బసవలింగ. ౨౮౨

అఖిలేంద్రియ భుక్తులర్పితంబయ్యెబో తను గుణావళులర్పితముగవలదె - తనుగుణావళులర్పితంబయ్యె బోనిజాంతః కరణం బర్పితముగవలదె- తనివిదీరంగ నంతఃకరణం బర్పితంబయ్యె బోప్రసాదరసనగర్భ - నిర్భయార్భక సదాంతర్భరితంబు మహాప్రసాదంబుదానర్పితాను - భవముబొందెడి వారికి భక్తుడగుచు - త్రివిధలింగైక్య జ్ఞానంబుదెలిసియాత్మ - నిర్వికల్పసమాధిని నెగడుచున్న - వాడె
ప్రసాదియగు భువి బసవలింగ. ౨౮౩

చనువుమీరగ ననుదినవర్ధమాన గతాస్థినఖర చికురార్పణముగ - చర్మకీలాలమాంసస్థూలసూక్ష్మాంగదహనాంగగణశోషణార్పణముగ - సమధాతు జనిత విషమధాతుజనిత నిజారోగ్య రోగసమర్పణముగ కాలానుగతసహగమన సంయోగమనాగ మనము వివిధార్పణముగ - నఖిలధనధాన్యవస్త్రవిద్యావిభూషణాదిసంపదసేవలునవ్యయములు - నర్పితము జేసి వర్తించునాప్రసాది-
బరగు సర్వప్రసాదినా బసవలింగ. ౨౮౪

భవిహూపమాది ప్రవాహతటాకాదిభస్త్రి కమండలు భాండవారి - భవిజనారంభవసంభవ ధాన్య నికరతదారామకుల్యాల తాంతరాది - భవిజనస్పర్శన పల్లవకందము లౌషధప్రముఖ పదార్థసమితి - భవిదృష్టి పతనాంనపానాది బహుపాకతైలప్రభృతిరస ద్రవ్యచయము - భవికృతాంబరాదులు భాండభాజనాదులగు నిషిద్ధవస్తుచయముల భవితత్ప - ర్శనాఘ్రాణములు తదీయప్రసా
ది - కెనగు నె ప్రసాదసౌఖ్యంబు బసవలింగ. ౨౮౫

లోకనిషిద్ధాన్న పాకాదులెల్లనంస్కార కృతాన్నపాకములు సమము। కానసంస్కార కృతాన్నర్ణములు వానిపూర్వాశ్రయం బెట్టుబుచ్చవచ్చు। సంస్కార కృతపాకశాకాన్నాదులును సంస్కారితదర్శన స్పర్శనాది। దర్శనస్ప

ర్శనాత్మకమైన విషయాదుల విమెల్ల నిరసనమమరసల్పి । భవివితాన క్రియాశుద్ధి జరగజేసి । భవివిసర్జనమైనట్టి భక్తుడెపుడు । సిద్ధలింగ సూక్ష్మాచార శుద్ధివలన । భావశుద్ధి నియతిసిద్ధ బసవలింగ. ౨౮౬

సమధి గతానఘ్యూ సద్గురుజాత పవిత్రేష్ట లింగసుక్షేత్రవంచ । కేదారవిధియ స్రిసాదిబరీక్షించి గరమొప్పనంతట కర్షకుండు । వర్తించురీలిని వలనొప్పకేదారమందున ఫలితంబు బొందువడగ । ఫలములు యుష్మదర్పణ మాచరింపుచు ప్రతిముహూర్తము క్రొత్తపంటయైన । తత్స్వయంకృషి ప్రోక్తతత్ప్రసాద- ఫలనిరంతర భోగసంప్రాప్తినటకు । 'సస్యకృషిఫలాదులు ముట్టడాప్రసాది । వెనగళా ప్రాఢియెట్టిదో బసవలింగ. ౨౮౭

చరియించు తద్ద్వతాచార ప్రవర్తనలర్పించు నీమనంబందియుండి । ముట్టినానాకంద మూలాన్న పానాదులర్పించు నీకరంబందయణగి । పొందునానా వస్త్ర భూషణమాల్యాదు లర్పించు నీయాత్మయందయణగి । పాయునానాకర్మభాష్పకణాదులు నర్పించుబుద్ధినీయందనిలిపి । యట్లస్వప్నావగత భవదాప్రసన్న । సుఖములర్పించుచును పులకముఖుని జేసి । యాప్రసాదియు తత్ప్రసాదాంచితాను । భవసుఖంబందు నీయందు బసవలింగ. ౨౮౮

విహితావిహితము లౌవిధినిషేధక్రియలవి రెండునీకు నమర్పణముగ । నందు సముద్భవంబగు పుణ్యపాపంబులవి రెండునీకు నమర్పణముగ। నందుసంభూతంబులగు శుభాశుభచేష్టలవి రెండునీకు నమర్పణముగ । నందుసంజనితంబులగుసుఖదుఃఖంబులవిరెండు నీకునమర్పణముగ । తత్పరంపరరాజకృత్యములమీరు । భక్తిముక్తులురెండు సమర్పణముగ । జనతదీయఫలానపేక్షప్రసాది । కెనగుసిద్ధ ప్రసావంబు బసవలింగ. ౨౮౯

హానివృద్ధులును జయాపజయంబులు నాదియాక్రియలు నీ కర్పణముగ । నావదసంపదల్ హర్షాదులిటుల లోపాలోపములును నీకర్పణముగ । మానావమానముల్ హీనాదికంబులు నవిమెల్లనీకు సమర్పణముగ । నిందాస్తుతులు కర్మనిష్కర్మములును కార్యాకార్యములును నమర్పణముగ । కామనాకామములును రాగములు ద్వేష । ములును క్రియలెల్లతత్ప్రముఖ్యదిశలు । నర్పణముగాగ మున్నున్నయాప్రసాది । కెసగునే భవభంధముల్ బసవలింగ. ౨౯౦

ఘనతరంబైనట్టి గంధవస్త్రాభరణాదులు నీకుసమర్పణముగ । చూపులురూపులు శ్రుతులును మఱియు శాయని రీతినీకుసమర్పణముగ । వాసనలును శ్వాసవర్గంబులును ధర్మాధర్మములును నీకర్పణముగ । రసములు రసనాగ్రరసములు శాటలు నాటలు చదువులు నర్పణముగ । వీనులాలించుటలు గూడవివిధవిషయ। సుఖములర్పించిగైకొను సుప్రసాది।పంచభూతాదికృత్యముల్ బహువిధముల। పరిణమించంగ దానేర్చు బసవలింగ. ౭౯౧

తలపనర్పితవిధి దారునేభవదంఘ్రి శతపత్ర కీర్ణ కౌశలలవలన । పలుకునర్పితవిధి జిలుకునేభవ దభిదాధానామృతరసపాత్రంబువలన। భావంబునర్పితపద్ధతిబొలయు తద్భాశ్రీమదనోత్సవమునమునిగి । ప్రాణంబునర్పిత పధనాదిజనునె తత్ప్రాణలింగైక్య సంపదలబొదల । దన్నుచూపునె యనమర్పితములరొదలు। దానకాగత ప్రాణమధ్యముననణగి । యింద్రియంబుల కర్పింప నిచ్చనేయ। బడునె తత్ప్రసాదియు బసవలింగ. ౭౯౨

మదనవికారంబు మదిబుద్ధిశక్తి తలపులర్పించెడి కొలదిమెరిగి । రమణిని నావేళ రతిబుట్టినాడెదు మాటలనేర్పరి వాటమెరిగి । అంగసంగతి చుంబనాలింగనాదుల తీపు లర్పించెడి తెలివియెరిగి । దమకించు పొందుచే దన్నెరుంగనియట్టిసుఖము లర్పించెడి సూక్ష్మమెరిగి। బరగనంతరంగ బహిరంగములయాత్మ।విషయగతుల సహితవివరమెరిగి । యర్పణంబుసేయు నతడు ప్రసాదాంఘ్రి । పటుదయాంతరంగ బసవలింగ. ౭౯౩

శాఖమిశ్రమము విస్తారంబు నర్పించు పాకమిశ్రక్రియా పరికృతియట్ల। పాకమిశ్రము పొందువరగ నర్పించుచో రసమిశ్ర మర్పించురమణయెట్లు । రసమిశ్రమ వధానురతిరస ముట్టించురుచి మిశ్రమైనట్లు రూపమెట్లు । రుచిమిశ్రమాత్మను రూపమర్పించుచో వివిధమిశ్రార్పణ విహితమెట్లు । విషయమిశ్రమాత్మ విభుజూచ్చియిచ్చుచో । తత్ప్రసాదమను విధానమమర । వెలయమిశ్రమైనవిధాన్నరసములు। పరిగ్రహించుటెట్లుబసవలింగ. ౭౯౪

రాదుపూర్వంబన్న రాదుపూర్వమువచ్చు నగుద్రవ్య తత్పూర్వమణగుటెట్లు । ముట్టియు నిడరాదుముట్టక నీరాదు ముట్టక ముట్టించు ముట్టరెట్లు। రుచులెరుగకరాదు రుచులెరుంగుటయుగాదు రుచులర్పణముసేయ రూపమెట్లు । సోకరా

దర్శించి నూకె రాదొల్లక గంధదుర్గధసంబంధమెట్లు । యిచ్చిగొనగరాని యీ రానివాహనా। నసవిథార్పణములచందమెట్లు । మిగులబొందగలుగు దగవస్త్ర భూషణ । భావమెట్లుగలుగు బసవలింగ. అ॥ ౫

తాసునందున మరి బేసిలేకను యొక్కచందమై తూకంబుబొందినట్లు । యుక్తంబుగామంచి నొకదిక్కు వేయంగనున్న దిక్కున నేత యొనరునట్లు । నరి ధనుర్ధారుడు లక్ష్యంబేయ బాణంబు దోడ్తోన రేంద్రుండుదోచునట్లు । బిలుచుచు నిద్రించ బేరొక్కన్న నైనయక్షరముల తోన మేల్కొంచినట్లు । ననమశబ్దాదివిష యసుఖానుభూతి । శ్రోత్రిముఖ్యేంద్రియంబులు సోకునపుడు । నతిశయంబుగ తత్ప్రసాదానుభవము। భవ్యమగురీతి దానెట్లు బసవలింగ. అ॥ ౬

జగమున గొందరు శైవులమంచును బల్కుచుందురు మరిపాటిగాను । వివ రంబుగా సప్తవిధశైవ భేదంబు లెరుగనేరరుగురుతరముగాను। వృత్తిశైవంబగుబ త్తివైష్ణవ మగుత్రి కరణశుద్ధి లేదెంచిచూడ । గీర్తింపగా శివగీతలు జదువరుదగ భగవద్గీతలగణితంబ । టంచుబల్కుచునుందురు పంచముఖుడు । ఘనముమీరిన భగవంతుడనెడుబుద్ధి । దోచదేమందు వైష్ణవతుల్యులవని । వనశివప్రసాదు లెట్లు కో బసవలింగ. అ॥ ౭

ఆకసమున గడుజోకను జనుదెంచు వైనతేయునిజూచి మానుగాను । ద్వా రకాపురి వాసకారుణ్య సాగర ధీయుతపోష కృష్ణాయటంచు। బొగడుదురరిము రి జగదోపకారియా వృషభేశుస్మరణ గావించరెవుడు । మోదంబుమీదప్రపన్నుల విభీషణాయనుచు స్మరించెదెరనుదినంబు । నీదుభక్తుల జూడరునీస్వరూప । మిట్టిదన్నను మరిజెవిబెట్టరహహ । యట్టివారిని భువిశైవులనుట దెట్లు । వసుధ వారప్రసాదులౌ బసవలింగ. అ॥ ౮

దహనకార్యము ధరధర్మంబటందురు ఖననంబుధర్మంబుగాదటంద్రు। యేభూతమాదియా నీభూమిస్థూల శరీరాదులకును మాతృకయనెద్ది । యట్టిభూతం బునగుట్టుగా డాగుటకన్న నుదహనంబు మిన్నయనునె । శంకరుండన నొప్పు షణ్మతోద్ధారకుండును సమాదియుధర్మమనెనుగాదె । బూనియెన్నడుమరి ము ట్టరానివారు । డాకిగాల్చుట శల్యముల్ దాచినీట। గలపువారలు మేముశైవు లమటంచు । బల్కువారు ప్రసాదులా బసవలింగ. అ॥

భవదక్షుణాచలప్రథితనియమ ఘృణాపరిపాక కేళి విహారణములు । భవదివ్య గురుపాదపద్మరజస్స మోద్భూతానుభావవిఖ్యాతినుతులు । భవదంఘ్రిసరసిజ ప్రస్తుతపాంసున ముత్తంసనసీమానుమోదయుతులు । భవదనుభూతవిస్ఫార సుఖామృతరుచిర సర్వేంద్రియారూఢ మతులు । జేయునీస్తవంబు జెవులారవినువారి । వ్రాయువారిజదువు వారివిస్త । రించువారి నతిసమంచితముగ బ్రోవు । పటుదయాంతరంగ బసవలింగ. 300

ఇది శ్రీమద్బసవేశ్వర ప్రసాద లబ్ధకవితా ధురీణ భృంగిరిటగోత్ర
శ్రీమత్పాలుకురికి సోమనాథ ప్రణీతంబగు చతుర్వేదసారము



శ్రీః.

# అముద్రితగ్రంధప్రకటన.



వైదికోత్తములారా!

## శైవశ్రౌతకళానిధి.

వినుండు. శ్రీమదుత్తరవాతూలాంతర్గతంబగు శైవశ్రౌతకళానిధి యనుమహా గ్రంథంబొకటి బహుప్రయత్నములచే సంపాదించినాడ. యచ్చొత్తించుటకు రు 1000 గావలసినట్లున్నవి. గాన సద్గుణాకరులు వారివారికిదోచినంత ద్రవ్యసహాయంబుగావించి నాపూనిక నెరవేర్చ ప్రార్థించెద. నిందుమూడుఖండములుకలవు.

---

అందుగలవి విషయంబు లేమనగాగౌరీదేవి యధ్వరంబులు సల్పువారికి ఫలంబేమని శంకరునిగూర్చి ప్రశ్నజేయుటయు పశుబంధంబొనర్చిసవనంబుసల్పువారికి స్వర్గభోగమేగాని సాలోక్యాది పదవులులేవని శంభుండు వచించుటయు దత్కారణంబేమని ఉమాదేవిమనవిజేయుటయు పిష్టపశువుచే రుద్రయాగంబు సల్పువారికే చతుర్విధ పదవులుగలవని పశుపతి వక్కాణించుటయు తత్క్రమంబుదెల్పుమని దేవి ప్రార్థించుటయు నంతట పిష్టపశుక్రియంబును యాగమంటపాదుల లక్షణంబును శతక్రతువుల వివరంబును మహేశ్వరుండు మాదేవికి విశదపరచుటయు నిన్నివిషయంబులచే ముప్పదియారుపటలంబులై ప్రథమ ఖండంబు వెలయు.

---

యజమాన-దీక్షిత - శ్రోత్రియ - ఉద్గాత-హోత - అధ్వర్యు - ప్రస్తోతమైత్రావరుణ- ప్రతిహర్త-అగ్నీధ్ర-సుబ్రహ్మణ్యాది- క్రతుసాధకుల- లక్షణంబు-లును యనేకానువాకంబులు గలసిద్వితీయ ఖండంబు విస్తరిల్లు.

---

శతక్రతుఫలితానుక్రమణికయు రుద్రయాగఫలలక్షణము శైవదీక్షజొందక యజ్ఞము జేయువారికిగలుగు దోషవివరము సప్తవిధశైవదీక్షాలక్షణంబును మొద

లగు ధర్మంబులచే నిరువదియైదుపటలంబులుగల తృతీయఖండంబునిలసిల్లు.

---

## వీరశైవసారసంగ్రహము.

శ్రీమన్నిగమాగమపురాణేతిహాసాంతర్గత ధర్మంబులుగూర్చి మొనర్పం
డిన వీరశైవసారసంగ్రహంబను గ్రంథంబుముద్రింపించ ప్రయత్నించుచున్నవాడ.
తద్గ్రంథంబునగలవివరంబు.

---

యెవ్వారు జనన కాలమాదిగా లింగాంగులో యెవ్వారికులమంతయు భిన్న
భావము లేకయుండునో యెవ్వారి సంతతికెల్లను లింగధారణ లేకున్న సిందగల
గునో యెవ్వారుగోత్రప్రవరాదులెరిగి షోడశకర్మలు గావించుకుందురో యెవ్వా
రువేధామంత్ర క్రియాసహితమైన యేకవింశతి దీక్షాక్రియంబులు దెలియుదురో యె
వ్వారేకోత్తర శతస్థలవిచారపరులై చతుష్షష్టిశీలంబులెరింగియష్టావరణసిద్ధిగలి
పంచాచార పరులగుదురో వారేవీరశైవులని దెల్పగలయనేక ప్రమాణంబులుగలి
పంచవింశతి ప్రకరణంబులంబరగు.

---

## దేవబ్రాహ్మణవిమర్శనము.

దేవబ్రాహ్మణవిమర్శనమనుగ్రంథంబనేకగ్రంథప్రమాణంబులుసంగ్రహిం
చిప్రాసినాడ. దేవునకు బ్రాహ్మణునకు గలయభేదప్రతిపత్తియు దేవశబ్దము భగవం
తునకు బ్రాహ్మణశబ్దము విప్రునకీరెండుశబ్దములువీరిరువురికేదప్ప తక్కిన వారి
లకు తచ్ఛబ్దంబులు ఘంటాపథంబుగా జెల్లవనియు వీరిరువుల ధర్మంబులపరిమి
ముగా దెలుపగలిగి పదునైదు ప్రకరణంబులైదనరు.

ఇట్లువిన్నవించు,

గంగపట్టణపు సుబ్రహ్మణ్యదేవర

---

